ఓమ్ శ్రీ సాయి నాథాయనమః



# సరస వినోదిని



ఆకాశవాణి విజయవాడ కేంద్రం వారు సంప్రదాయ పద్య రచనకు స్ఫూర్తినిస్తూ ప్రసారం చేస్తున్న 'సరస వినోదిని' కార్యక్రమం కోసం 1968-88 కాలంలో

**బాపట్ల వేంకట పార్థసారథి**

రచించి సమర్పించిన

**సమస్యాపూరణ**

**దత్తపది**

**వర్ణన**

పద్యావళీ శతం



చిరునామా :

శ్రీ సాయీ నిలయమ్ - చెరువు (పోస్టు) 522113

ఫోను : 086432 - 7565

# SARASA VINODINI

*A collection of poems on "Given Subjects"*

---

*Written and published by*

© **BAPATLA VENKATA PARDHASARADHI**
Cheruvu (P.O.) 522113
Phone 086432-7565

*Front cover photo :*

Courtesy: Annapurna Studios, Hyderabad.

*For copies :*

- Author, at the above address
- Visalandhra Book House (all branches)
- Dr. R.A. NAIK, MD
  Opp. Lions Club, Bus Stop, Ramnagar
  VISAKHAPATNAM - 530002
  Phone: 0891-569829

*Typeset and Printed at :*

Ramsha-Siriesha Publications
SAMALKOT 533440 (Ph. 0884-327474)
email: poosha@vsnl.com

Price Rs.15



# ఉలుపా

శ్రీమాన్ బాపట్ల వేంకట పార్థసారథిగారొక మహోన్నత వ్యక్తి. సాయినాథ పద సరోజ నిత్యార్చన శీలురు. జ్ఞాన వయోవృద్ధులు. వీరు పండిత కుటుంబము నుండి వచ్చినవారు. వీరి తండ్రిగారు కీ॥శే॥ హనుమంతరావుగారనేక కావ్యములు విరచించిరి. అందు వేదాంత దేశికుల పాదుకాసహస్రమునకు సముచిత స్వేచ్ఛాపద్యానువాదమొకటి. దానికి పీఠిక వ్రాయు భాగ్యము నాకు కలిగినది.

నేను ఉద్యోగరీత్యా రేపల్లె ప్రభుత్వ డిగ్రీ కళాశాలకు వచ్చిన సందర్భమున నాకు, శ్రీమాన్ బాపట్ల నాగేశ్వరరావు (ఇండియన్ బ్యాంకు- రేపల్లె) గారితో పరిచయ మేర్పడినది. అది క్రమముగా స్నేహముగా పరిణమించినది. వారి వలననే నాకు శ్రీమాన్ పార్థసారథి గారితో పరిచయాదృష్టము కలిగినది.

శ్రీ వేంకట పార్థసారథి గారు జన్మతః కవులు. వారి పద్యరచనలో పాండిత్యము కన్నా కవితాప్రజ్ఞయే ఎక్కువగా గోచరించును. వారు విజయవాడ ఆకాశవాణి వారిచ్చిన (సరసవినోదిని) సమస్యలను చమత్కార సుందరంగా, కవితా మందిరాలుగా పూరించినారు. అసలీ సమస్యాపూరణమను కవితా ప్రక్రియ, సంస్కృతాంధ్రాలలోనే ఎక్కువగా రూపు తాల్చినది. ఒక పద్యమునకు నాల్గు పదములుండును గదా! నాల్గవ పాదమును అర్థరహితముగానో, అశ్లీలార్థముతోడనో సమస్యగా నిత్తురు. కవి, పై మూడు పాదములలో, ఆ అశ్లీలార్థమునో, అపార్థమునో తొలగించి, చమత్కారముతో పద్యమును పూరింపవలయును. సమస్యాపూరణ మొనర్చు కవికి, ఛందోజ్ఞానము - శబ్ద-పాండిత్యము; అన్నింటికీ మించి లోకజ్ఞానముతోడి వివేకము - పూరణ సామర్థ్యము-అవసరము. వీనిలో నేది లోపించినను, సమస్యా పూరణము రసవంతము కాదు. ఉదాహరణమునకు, "కలలో గర్భంబువచ్చి కాంచెన్ శిశువున్" అని యిచ్చిన సమస్యను: "పూరి పాకలలో గర్భంబు వచ్చి కాంచెన్ శిశువున్" అని ఒక కవి పూరించెను. మరియొక కవి (భార్యా భర్త లిద్దరు విడియాకులు తీసుకొనిరి కాని, భర్తకామెయంద నురాగము చావక ఆమెకడకు వచ్చి పోవుచుండెను అను అర్థములో) "ఆ రాకపో కలలో గర్భంబు వచ్చికాంచెన్ శిశువున్" అని పూరించిరి. రెండును మంచి పూరణములే. కాని, రెండవ పూరణమౌచిత్యవంతము, చమత్కార భరితము. మొదటి పూరణము అతి సామాన్యము, అచట శబ్దసాంగత్యార్థము తప్ప చమత్కారార్థము లేదు.

ఇక శ్రీమాన్ వేంకట పార్థసారథి గారు, సమస్యా పూరణముల నలవోకగా

కావించిరి. కొన్ని విరుపులు, ఆశ్చర్యజనకములై పాఠకులకమందానందమును కల్గించును. ఉదాహరణకు

"తారా! రమ్మని రామమూర్తి పిలిచెన్ దారన్ ప్రమోదమ్మగన్".

శ్రీరాముడేకపత్నీవ్రతుడు. ఆయన భార్య సీత. ఆయన భార్యయైనతారను ప్రమోదముతో పిలిచెనట. ఎంత అనంగతమీా నమన్య! దీనిని ఎంత సామర్థ్యవంతముగా వీరు పూరించిరో గమనింపుడు :

"క్రూరాత్ముండగు రావణుండు సతినిన్ గొంపోవ చింతించి ఘో
రారణ్యంబుల నెందుఁగానక మతి భ్రంశంబుఁ దానొంది యే
తీరై యెందును జూడ సీతగని భ్రాంతింజెంది వాపోయి "సీ
తా! రా! ర" మ్మని రామమూర్తి పిలిచెన్ దారన్ ప్రమోదమ్మగన్"

ఎంత చక్కని పూరణము! 'తార'ను విడగొట్టి, ముందు 'సీ' చేర్చి 'సీతా! రా!' అనునర్థమున పూరించుట కవి ప్రతిభకు దర్పణము. ఇటువంటి మధుర పూరణము లిందెన్నోయున్నవి. పాఠకులు గమనింతురుగాక.

సమస్యాపూరణముగాక 'దత్తపది' అను నింకొక మనోజ్ఞమైన ప్రక్రియ కలదు. పృచ్ఛకుడు, నాల్గు పదములిచ్చును. వానికి పరస్పరార్థ సంబంధ ముండదు. కొన్ని పరభాషా పదములు కూడ ఉండవచ్చును. పృచ్ఛకుడిచ్చిన పదములకు, ఆ అర్థము రాకుండ భిన్నార్థము వచ్చునట్లు కవి పూరింపవలయును. చక్కని విరుపులతోను, శ్లేషార్థములతోను, విసర్గలు కలుపుకొనుటతోను, కవి నమంజనముగా పూరింపవలయును. భిన్నభాషా పదముల కాంధ్రత్వమును కల్పింపవలయును. పుష్కల ప్రతిభా పాండిత్యము లున్నగాని, దత్తపదిని పూరించుట సాధ్యము కాదు. ఈ కవి గారికి, దత్త పదులను పూరించుట వెన్నతో బెట్టిన విద్య.

కిటి-కటి-తటి-నటి : ఈ నాల్గిటియందు కిటి యనగా పంది, కటి యనగా పిరుదు, తటి యనగా తటములు కలది. నటి-యనగా - నటించగలిగిన స్త్రీ; అని అర్థములు. ఈ కవి యెట్లు పూరించెనో ఆరయుడు:

కిటికి కడ నిల్చి యొక్కఁడు కిటుకుఁ దెలుపఁ
గటిక చీఁకటి పాలు మీఁగడలు యమున
తటికిఁగొనిపోయి మిత్రులఁదనుపుదట; చె
నటివె? వ్రేఁతలవంచింపనంద తనయ!

ఎంతరస బంధురముగా, ఎంతటి చమత్కారముగా భిన్నార్థములలో పద సంయోగమును ఘటించెనో వేరుగా చెప్పనవసరములేదు. చాపలమున నిట్టిదే

మరియొకటి తడవు చుంటిని.

అంత-చింత-వింత-సంత (ఉగాది సందర్భము)
అంతమె బాధల కిలలోఁ
జింత లడఁ చినేఁడుగాది చిత్తమలర - జీ
వింతమనుచుఁ గాంతునితో
సంతకుఁ బూఁ బోడి యొకతె చతురత నరిగెన్

'అంత' అను తెలుగు పదము 'అంతము' అను సంస్కృత పదముగా మారినది. 'చింత' యనగా ఒక చెట్టు పేరు; కాని అది 'చింత' (బాధ) అను సంస్కృతపదమైనది. 'వింత' అనగా అచ్చెరువు. అది 'జీవింతము'లో కలిసి పోయినది. 'సంత' చెప్పాట పోయి, తెలుగు 'సంత' కేగుటయైనది. ఎంత చమత్కారము!

ఈ విధముగా చెప్పచు పోయినచో పద్యములన్నింటిని ఉదహరింప వలయును. ఈ కవి కవిత ప్రజ్ఞాస్ఫోరకమే అని ముందే మనవిచేసితిని. 'నిరంకుశాః కవయః' అన్నట్లు కొన్ని స్వతంత్రించి ప్రయోగింతురు. 'వ్యాకరణం దారి వ్యాకరణానిదే - మహాకవుల దారి మహాకవులదే' అన్నది మహాకవుల విషయంలో సార్థకము.

ఈ రసభరిత చమత్కార పద్యశతిని, చిత్రరంగమున మకుటములేని మహారాజుగా, తెలుగువారి వెండితెర వేలుపుగా 'నటసమ్రాట్టు'గా ఐదు దశాబ్దములకు పైగా ప్రజా నీరాజనములందుకొనుచున్న డా॥ నాగేశ్వరరావుగారి కంకితమిచ్చుట, బంగారమునకు తావియబ్బినట్లైనది. "మణినావలయం - వలయేన మణిః" అనునట్లు ఈ కావ్య కన్యాపరిగ్రహణముచే శ్రీమాన్ అక్కినేని వారికిని, ఈ కావ్య కన్య నిచ్చుటచే శ్రీమాన్ బాపట్ల వారును వియ్యమంది, ఇతోధికముగా అభివృద్ధి నొందగల రనుట అసంశయము.

నిజమున కిట్టి ఉత్తమ కృతులకు 'ఉలుపా' లవసరములేదు. శ్రీమాన్ వేంకట పార్థసారథి గారికి నాయందున్న అవ్యాజాభిమానమే వారి నిట్లు ప్రోత్సహించినది. కృతికర్తకును, భర్తకును శ్రీశుడు చిరాయు రున్నతులు ప్రసాదింపగలడని భావించుచు, ఈ అవకాశము కల్గించిన కృతి కర్తకును, మిత్రులు బాపట్ల నాగేశ్వరరావు గారికిని, కృతజ్ఞతలు తెలుపుకొనుచుంటిని.

ఇట్లు
బుధజన పాదరేణువు
**మొవ్వ వృషాద్రిపతి**
విశ్రాంతాంధ్రోపన్యాసకుడు

ప్రమాది - శరత్తు
రేపల్లె

# ప్రశంసాదామము

'సాహితీ వాచస్పతి'-'ఉపన్యాసచతురానన'

**మొవ్వ వృషాద్రిపతి**, రేపల్లె.

మ॥ కవిచంద్రా! భవదీయ కావ్యము రసజ్ఞశ్రేణి కానందహే
తువు - సాహిత్యరసాబ్ధి చంద్రకళ - నిర్ధూతాఘ లావణ్య - సం
స్తవనీయైక గుణౌఘరమ్య - నవ భూషాభాజనాహార్య - మా
ర్దవ సందానిత శబ్ద భావ వచనార్థస్వచ్ఛ మర్యాదలన్

కం॥ అనఘ! సమస్యాపూరణ
మను ప్రక్రియ నాస్తి సంస్కృతాంధ్రములవినా
అనితర భాషా సాధ్యం
బనుపమ సామర్థ్యశక్తి కది దర్పణమౌ

కం॥ అలవోకగ నూరు సమ
స్యల పూరించితివి ప్రజ్ఞ స్పష్టముగా ని
య్యల పండిత సత్కవి వ
ర్యుల సరసన పెద్దపీట నొప్పెదు సుకవీ!

చ॥ రసములు చిందుచున్న గుణరమ్య నలంకృత కావ్య కన్యకన్
పసదనమట్లు యోగ్యుడగు భర్తకు నిత్తునటంచు నెన్నొ సాం
పొసగెడు వియ్యముల్ వెదకు చుంటివి దిక్కుల - నేడు నీ శ్రమం
బసదృశమై ఫలించె నట హారి వరుండు లభించినందునన్

చ॥ ఎనుబది చైత్రముల్ గడచియేగెను నీదు చరిత్ర - రాగభా
వనల ద్వితీయ యౌవనము వచ్చిన దంచుతలంతు - నీవయ
స్సున నొక పండువంటి గుణ సుందరి పుత్రిక పుట్టెనీకు - నీ
వనుపమ భాగ్య శాలివని యందు - తనూజలె కీర్తి హేతువుల్

ఉ॥ ఓ కవి లోక చంద్ర! భవదుత్తమ కావ్య కళా కుమారికన్
గైకొన వచ్చె సర్వగుణగణ్యుడు విశ్వ పరీతకీర్తి సం
శ్లోకుడు చిత్ర భూగగన సూర్యుడు ఆదినటావతంసుడా
సూకర ఘోర రాక్షస నిషూదన తుల్య కళా ప్రపూర్ణుడే

గీ॥ ఎనుబది శరత్తులకు కొంచె మించు మించు
ప్రాయమున నొప్పు నవయువ వరుడు దొరికె
పదియు నైదేండ్లు నిండని పడుచు తోడ
సరసతయు కాపురము లెట్లు సాగిచనునొ?

ఉ॥ ఆతడు అన్న పూర్ణమగ డౌటను ఈశ్వరుడౌను-తద్గళ
శ్రీతనరారు నాగము వసించును నామము ముందు - తాండవ
ప్రీతి రహించి, యాదినట విస్తృత కీర్తి గడించి రాయడై
భూతలమున్ సదారస విభూతి పరిప్లుతమున్ పొనర్చెడిన్

చ॥ ముదురు వయస్సునన్ సవతిపోరు ఘటించె మగండటంచు, నీ
వద వద '**అన్నపూర్ణమ**' మహాసతి? కోపము చంద బోకు మిం
పొదవగ నీ వధూటి సరసోక్తుల హర్షము గూర్చు గాని, యే
కొదవయు కూర్ప బోదు, పరి గుంఫిత కీర్తి ఘటించు మీ కిలన్

చ॥ ముదిమి వయస్సునన్ పడుచు పోలిపయింగడు మోజు హెచ్చు -నీ
సదమల కావ్య కన్య గుణ శాలిని సుందరి లోక గౌరవా
భ్యుదయ యశోవిశాల పరిపూజిత యౌట మగండు తత్కళా
మృదుల విలాస సంపదకు మెచ్చి వసింపకయున్నె దానితో?

గీ॥ తన్వి గీచిన గీతను దాటడనుచు
ఆమెయే లోకముగ నుండునని తలంప
కీమె-నీవు నొకటిగా **నాగేశ్వరుండు**
నటన చూపించు దక్షిణ నాయకునిగ

ఉ॥ నిన్నును కావ్య కన్యకను నిర్మలమౌ ననురాగ దృష్టితో
నెన్నుచు నీమగండు చరియించు దిశావలయైక కీర్తియై
చెన్నగువైభవంబులను జెందుచు, సర్వశుభప్రసంగతిన్
దిన్నగ నన్నపూర్ణమ సతీ! శత వర్షము లీ ధరాస్థలిన్



# నాల్గు మాటలు

మా తండ్రిగారు, కీర్తిశేషులు బాపట్ల హనుమంతరావు గారు ఉభయ భాషా ప్రవీణులు, మహాకవులు. సాయీశ్వర చరణ కమలార్చన శీలురు. అర్ధశతాధిక గ్రంథకర్తలు. వేదాంత దేశికులు. పాదుకాసహస్రాదుల ననువదించిన పండిత ప్రకాండులు.

వారి వలన నాకు సాహితీ సంస్కారము ఔరసత్వముగా లభించినది. నేనును, నిజమైన పుత్రునిగా వారి యడుగుజాడలలో పయనించుచు, సాయినాథుని పద పద్మ సమారాధనము వీడక, సాహిత్య పూజా భావమును వదలక చరించుచుంటిని. ఆ సాహితీ ప్రియత్వమే నన్ను కవిని గావించినది.

విజయవాడ ఆకాశవాణివారు, సమస్యా పూరణమను నొక ప్రక్రియను సదా ప్రసారము చేయుచున్నారు. ఆ సమస్యలను పూరింప వలయుననను నుత్సాహము నాలో ప్రేళ్ళుబ్బి మునుపు రచనా రంగమున దిగితిని. కొన్ని సమస్యలను పూరించితిని. నేను రచించిన ప్రతి పూరణమును, రేడియోలో పఠించిరి. పూరణములు చాలా బాగున్నవని, దశదిశలనుండి ప్రశంసలు ధారాప్రవాహముగా నుబికి వచ్చినవి.

ఒక పరి హైదరాబాదులో నున్న మా అమ్మాయి గారింటికి వెళ్ళితిని. అనుకోకుండ, నా అభిమాననటుడు - నట సామ్రాట్టు శ్రీమాన్ అక్కినేని నాగేశ్వరరావు గారితో పరిచయభాగ్యమబ్బినది. తదుపరి వారి కుటుంబమును చూడగోరి వారి యింటికేగితిని. ఎంతో ప్రేమతో, ఆప్యాయతతో, అభిమానముతో, ఆదరించిరి. నా మదిలో తళుక్కుమని ఒక ఆలోచన తట్టినది: నేను పూరించిన సమస్యలలో నూరింటిని ఏర్చి కూర్చి ఈ మహానటుని గళ సీమ కుసుమోప హారముగా సమర్పించినచో బాగుండునని. వెంటనే భావము నాయనతో వెల్లడించితిని; ఆయన ముదలయైనది.

కార్యము మంచిదే. కాని గ్రంథము నచ్చు గావించుటెట్లు? నాకడ సరిపడు ద్రవ్యములేదు. ఎట్టులాయని విచారించుచుండ శ్రీ సాయినాథుని భక్తులు నా హితాభిలాషులు, వైద్య విద్యా ప్రపూర్ణులు డా॥ రామావత్ అమరసింగు నాయక్ గారు ముద్రణ భారమును స్వీకరించిరి. నా గుండెలపై బరువు దిగిపోయినది.

మా తమ్ముడు చిరంజీవి బాపట్ల నాగేశ్వరరావు, రేపల్లె ఇండియన్ బ్యాంకు నందుద్యోగించుచున్నాడు. వాని ద్వారా, ఖండ ఖండాంతరలబ్ధ ప్రతిష్ఠులు, శతాధిక గ్రంథకర్త 'సాహితీవాచస్పతి' శ్రీ మొవ్వ వృషాద్రిపతి గారితో స్నేహము చిరకాలముగా కొనసాగుచున్నది. వారిని కోరినదేతడవుగా 'ప్రశంసాదామము' 'మధురమందార' ములను సమకూర్చినారు.

నా కోరిక నెరవేరినది. కావ్య కన్యా వివాహముతో బాధ్యత తీరినది. నాయీ బాధ్యతలో పాలు పంచుకొనిన శ్రీమాన్ రామావత్ అమరసింగు నాయక్ గారిని వారి కుటుంబమును సాయినాథుడు సదా, సంపూర్ణ కరుణాకటాక్ష వీక్షణములతో రక్షించుగాక.

'ప్రశంసాదామ' 'మధురమందార'ము లొసంగిన శ్రీ మొవ్వ వృషాద్రిపతి గారిని, వారి కుటుంబమును, వారి యిష్టదైవము శ్రీరామచంద్రుడు దయా తరంగిత వీక్షణములతో సదా రక్షించుగాక.

'సరసవినోదిని' పేరున నా సమస్య పూరణముల ప్రకటించిన విజయవాడ కేంద్రము ఆకాశవాణి వారికి, పఠించిన పండిత కవులందరకు నా కృతజ్ఞతలు తెలుపు కొనుచుంటిని.

ఈ పుస్తకమునిట్లు సుందరముగా నచ్చుగూర్చిన డా॥ పూషా-పద్మ దంపతులకు నా మెచ్చుకోలు.

ఈ మహా యజ్ఞ ఋత్విక్కులు ఎందరో మహానుభావులు; వారందఱకు వందనములు.

ఇట్లు
బుధజన విధేయుడు,
**బాపట్ల వేంకట పార్థసారథి**



# కృతి సమర్పణము

**పద్మభూషణ, కళాప్రపూర్ణ**
**నటసమ్రాట్**
**డా॥ అక్కినేని నాగేశ్వరరావు**
గారికి

శశ్వ దనంత సద్యశము సాంద్రముగా జగమెల్లనిండ, ఈ
విశ్వజనంబు వెండితెర వేలుపు పెద్దగ సన్నుతింప మా
హేశ్వర పాదకింకిణి మహింబడె నీవుగ నంచుమెచ్చి నా
గేశ్వర రాయ! నిన్ను భజియించును లోకము నిండుగుండెతోన్

అనుపమ "మక్కినేని" విమలాన్వయ వార్నిధి - చంద్రరేఖగా
జన మునందె నందితడు సద్గుణుడైయన మెప్పుగాంచి, ల
క్షణముగ శుక్లపక్షమున చంద్రునిపోల్కి "**కళాప్రపూర్ణత**"న్
దినదిన వృద్ధిగాంచి వినుతింగనినాడవు కీర్తి కౌముదిన్

రమణీయ "**వెంకట రాఘవపురము**" నీ అభిజనమ్ముగ ధరాఖ్యాతిగాంచె
ధర్మాను సరణమ్ము తప్పని "**వేంకట రత్నము**" నీ తండ్రి రాణకెక్కె
పుణ్యపురంధ్రుల పూత చరిత్ర యౌ "**పున్నమ్మ**" నీ తల్లి పూజ్యయయ్యె
సహధర్మ చారిణి సాధ్వీ శిరోమణి "**అన్నపూర్ణమ**" నిక్క మన్నపూర్ణ

నీకు తగినట్టి వారసుల్ నిపుణమతులు
ఆత్మజులు "**వేంకటు**"ండు "**నాగార్జును**"ండు
అల త్రయీమూర్తులనదగు నాత్మజలను
ప్రబలినావు **నాగేశ్వరరావు**! ముఖ్య!

పిన్నతనంబునన్ వెలది వేషము దాలిచి నాట్యరంగమం
దున్న దపూర్వ భావియని యూళులు వాడలు మారు మ్రోగగా
వన్నెయు వాసి గాంచి గరువంబగు స్వచ్ఛకళాభిలాషతో
క్రన్నన చిత్రరంగమున కాలిడినాడవు వామనాకృతిన్

అప్పటి నుండి నేటివఱ కప్రతిమానముగా త్రివిక్రముం
డొప్పిన చొప్పునం బెరిగి యుప్పర మంటితి చిత్రసీమలో
నిప్పుడు నప్పుడున్ మరియు నెప్పటికైనను నీదు స్థానమున్
గప్పన ప్రక్కనెట్టగ జగా మొనగాడు జనింపలేడికన్

నీవు ధరించు పాత్రలకు నిండుగ ప్రాణము పోసి సత్కళా
దేవి యొసంగు దీవనల దేశ విదేశములందు విస్తృతం
బై విలసిల్లు కీర్తి కొనియాడగ పాత్రమవైతి, వింక నీ
కీ విపులాంధ్ర దేశమున నీడగు వారలు కల్గనేర్తురే?

**"దేవదాసు"** వా? లేక దేవల దేవీ ప్రి
యవిటుండు **"విప్ర నారాయణు"** డవా?
**"క్షేత్రయ"** వో, విశ్వ కీర్తి భాజనుడైన
**"కాళిదాస"** కవీంద్ర గంధ కరివా?
**"బాటసారి"** వా? భక్త వర **"చక్రధారి"** వా?
అల **"తుకారామ"** దివ్యాహ్వాయుడవా?
నంద సామ్రాజ్య వినాశ కారకుడైన
**"కౌటిల్యుడవా?"** పల్కు బోటి వగుదా?

అనుచు జగమెల్ల వినుతింప నతులితంపు
ప్రతిభ చారిత్రకములు పౌరాణికములు
సాంఘికములు జానపదంపు సకల రీతి
చిత్రముల నటించితి నేర్పు చిత్రితముగ

నీ వొక యింత యత్నమును నేరకయే నిను వచ్చి చేరె సం
భావన మీర నెన్నొ ప్రతిభాపరమైన పురస్కృతుల్ విశా
లావని యందు నా రవి కళాలయతారకమై యొసంగు నీ
పావన కీర్తి నిత్య నవ భాసురమై ప్రమదైక సారమై

భారత ప్రభుత నిన్ **"పద్మ భూషణ"** మహా
సద్బిరుదంబుతో సత్కరించె
విజయవాడ పురంపు ప్రజలొసంగిరి **"నట
సమ్రాట్టు"** బిరుదంబు సార్థకముగ

అల ఆంధ్ర విశ్వ విద్యాలయంబు "**కళా ప్ర**
**పూర్ణాఖ్య**" గౌరవంబును ఘటించె
నాగార్జునుని పేర సాగెడు విశ్వ వి
ద్యాలయము "**డిలిట్టు**" ననుపు పఱచె

"**కాళిదాస కౌస్తుభ**" పురస్కారమంది
అల "**రఘుపతి వెంకయ అవా**" ర్డందుకొనియు
ఘనత మీరి "**దాదా ఫాల్కె**" గౌరవంబు
లాదిగా పొందితివి **సుకళార్చనములు**

లెక్కకు మిక్కుటంబుగ వరించె పురస్కృతు లెన్నొ నిన్ను పె
న్మక్కువ, వట్టి యెక్కముల మాదిరి పేర్కొననేలవాని? స
మ్యక్కమనీయ భంగి నభిమానులు ప్రేమ సుధా ప్రధారలన్
జిక్కి యొనర్చు నట్టి యభిషేకములన్ వెలగట్ట నేర్తుమే?

కృతి కన్యన్ గొనుమన్న విన్నపము నంగీకారమున్ జేసినన్
గృత కృత్యుంబొనరించినట్టి ఘనునిన్ గీర్త్యుజ్జ్వలున్ సద్గుణో
న్నతునిన్, నిత్యపరోపకార రతునిన్ నాగేశ్వరావాహ్వయున్
స్తుతి యింతున్‌గద అక్కినేని కుల చంద్రున్ మహోత్సాహినై

నీ సౌజన్యము చిత్ర సీమకు యశోనిర్మాణ సత్కార్య ధీ
క్షా సంపత్తి నెఱింగి పొంగినది నా స్వాంతంబు నా కాశవా
ణీ సాహిత్యము గూర్చి పల్కిన కృతిన్ నీకున్ సమర్పింతునే
లా సందేహము కాన్క గైకొనగదయ్యా, మిత్ర చూడామణీ!

మామక కావ్యకన్యయిది మంజుల భావ కళా ప్రపూర్ణ శ
బ్దామృత కల్పవల్లి సుగుణాశ్రయ సీమ అలంకృతాంగి శో
భామిత వర్ణనీయ వినుమయ్య! నినుంగని మోహరాశియై
ప్రేమవహించి యెంతయువరించిన దెంతటి చిత్రమో కదా!

కల కల లాడుచున్ గృహమఖండ శుభంబుల తేజరిల్ల పెం
పెలయగ పిల్ల పాపలభివృద్ధి చెలంగ నపర్ణకన్నిటన్
దులయగు నన్నపూర్ణ సతి తోడ సుఖైక చిరాయురున్నతిన్
వెలయుము వందయేడులు భువిన్ షిరిడీ ప్రభుసాయి సత్కృపన్

**- రచయిత**

# లక్ష్మీ కటాక్షము

ద్రవ్య దాతలు లేకున్న కావ్య మెంత
గణ్యమైనను వెలుగును కాంచగలదె?
శీతకరుడెంత ఆహ్లాద సిద్ధుడైన
చెలిమి రవికాంతి లేక భాసింపగలడె?

అల్ల ఆకాశవాణి యం దప్పుడపుడు
ప్రచురిత సమస్యలెఱిగి పూరణములరసి
మంచి పద్యంబులొకవందమాల గ్రుచ్చి
వేడ్క ప్రకటింపమదిని భావించినాడ!

నా యదృష్టమేమొ నట చక్రవర్తిగా
తెలుగు గగనసీమ వెలుగుద్యుమణి
"అక్కినేని కులమహార్ణవాబ్జారి నా
గేశ్వరుండు నా కృతీశ్వరుండు.

కృతిని స్వీకరింప నెంచి యంగీకృతి
తెలుప నక్కినేని చెలుపు మెచ్చి
కావ్యమచ్చు కొసగగా తలంచితి కాని
కాని చేత లేక కానిదయ్యె

గుండె జబ్బుల నిపుణుండు వైద్యమున ధ
న్వంతరి తలదన్ను పండితుండు
"రాధోడు" గోత్రుండు "రామావదమర సిం
గ్నాయ" కాఖ్యుండు విజ్ఞాన ధనుడు
వైశాఖ వైద్యకళాశాల ప్రాచార్య
పదవీ విరాజిత పట్టభద్రు
డతిలోక పాండితీ చతురుండు విజ్ఞాని
రోగుల పాలి కల్పాగ సముడు

సకల సాధ్వీ శిరోమణి - సన్నుతాంగి
కమ్ర సుగుణాను తల్లిక - కల్పవల్లి
అమృత హృదయ "శ్రీలక్ష్మి" యర్ధాంగి గాగ
ప్రగతి పథముల పయనించు వైభవమున.

మూడు వేదంబులో? లేక మూడు వహ్ను
లో? యనంగ స్వసంతాన మొప్పుచుండె
"కృష్ణ కవిత" యనంసుత - "కృష్ణవీణ"
"కృష్ణవంశి" యనంగ ప్రకృష్ణ మహిమ

వారలుత్తమ ప్రతిభావిశారదలుగ
ఉన్నతోన్నత విద్యల నొప్పువారు
సింహరాజంబు కడుపున సింహశాబ
కములు గాక నక్కలు పుట్టగలుగునొక్కొ?

అంతటి వైద్య పండితుడనంత ముదంబున నర్థమిచ్చియ
త్యంతము నాదుకావ్య మిటు లచ్చొనరింపగ పూనుకొన్న వా
డెంత యదృష్టమోయిది? మహిన్ నెఱదాతలు సున్నయైన ని
శ్చింతగ పుణ్యకార్యములు జీవముతో విలసిల్ల నేర్చునే?

బలి, శిబి, కర్ణ దధీచుల
తలదన్నిన దాత యనుచు ధరకొండాడన్
విలసిలు **'ఆర్యేనాయకు'**
నిల పోలగ నున్నవారె యెవ్వరు నైనన్?

వారిని వారి కుటుంబము
నారసి సాయీశ్వరుం డహర్నిశము కృపా
పార కటాక్ష విలోకన
కూరిమి రక్షించుగాక కోరిన విడుచున్

**రచయిత**

డా॥ **ఆర్.ఎ. నాయక్,** యమ్.డి.,
ప్రొఫెసర్, మెడికల్ కాలేజీ, విశాఖపట్నం.

# సరసవినోదిని

ఆకాశవాణి విజయవాడ కేంద్రం వారు నిర్వహించిన ఈ శీర్షికలో
1968-88 కాలంలో ప్రసారం చేసిన
సమస్యాపూరణ-దత్తపది-వర్ణన-పద్యాలు

  

1. సమస్య :- **నడుచుచు నుండువారి చరణంబులకే గద రాల తాకుడుల్**

పూరణము :- విడిచెను "గాంధి" ప్రాణములు-పీడెను "జవ్హరు" సర్వసంపదల్
పడెను "సుభాసు"బాబు పలుబాధల, నొడ్డెనిజాత్మ "పొట్టిరా
ముడు" కలరెందరో భరత భూమిని పుణ్యులు; జాతి రక్షకై
**నడుచుచు నుండువారి చరణంబులకే గద రాలతాకుడుల్**

2. సమస్య :- **ఏ యెడ మేలె చూతురు - గణింపరు జాణలు జాటు పాటులన్**

పూరణము :- మాయను దాటరాదు; పతి మాటయు తప్పగ రాదు, చెల్లి కై
కేయి యభీష్టమట్లు జరిగింపుడు; జానకి తోడపోయిర
మ్మాయని రామలక్ష్మణుల నంపిరి కానకుతల్లులిద్దరున్
**యేయెడ మేలె చూతురు గణింపరు జాణలు జాటుపాటులన్**

3. సమస్య :- **దీపము పెట్టె నింట సుదతీమణి భల్లున దెల్లవారగన్**

పూరణము :- "నీపని పాడుగానుగదె! నిద్దురదద్దమ! లేవవేమె! నీ
వీ పసి వాని మర్చితివ, యే" మని అత్తయు తిట్టెనంచు నా
లాపన జెంది, లేచి వెసనాముదమున్, వస, వెచ్చఁజేయగా
**దీపము పెట్టె నింట సుదతీమణి భల్లున దెల్లవారగన్**

4. సమస్య :- **కారమది దేశ కల్యాణ కారణమ్ము**

పూరణము :- ధర్మపథము విడువక - సత్కార్యములను
చక్కగా సల్పి - శ్రమగొని - స్వార్థకాంక్ష
లుడిగి మనమొక్కటిగ పాటుపడిన - పురుష
**కారమది దేశ కల్యాణ కారణమ్ము**

5. సమస్య :- ముక్కు నమ్మిరైతు మోసపోయె

పూరణము :- మొక్కజొన్న చేను మొదలు కోయగఁ బోయి
దంటుతెగక యింటిదారిబట్టె
బక్కదున్న మేత బదులాయె! కొడవలి
ముక్కు నమ్మి రైతు మోసపోయె!

6. సమస్య :- మెరపుందీవెలు, నీటి మీదబుడగల్, మీ సాలపై దేనియల్

పూరణము :- పరమోదార విశుద్ధ వర్తనము; సద్వంశంబు, సద్భావ సుం
దర రూపంబుల నీడు జోడయిన కన్యారత్నమున్ గోరనా;
వరకట్నంబులు లాంఛనంబులు వరుల్ వాంఛింపరాదీ సిరుల్
మెరుపుందీవలు, నీటి మీద బుడగల్, మీసాలపై దేనియల్

7. సమస్య :- కాదని వంకలొత్త తిలకంబులె యీనరజాతి వృత్తముల్

పూరణము :- వాదములేదు - బంధు పరివారము వేరుగ జూడలేదు, మ
ర్యాదల లోటులేదభిమతా న్నము లీయగ జంకలేదు. త
ప్పేదియొ? నిష్ఠురంబులననేల వివాహపు విందు పంక్తిలో
కాదని వంక లొత్త తిలకంబులెయీ నరజాతి వృత్తముల్

8. సమస్య :- కదురు పాడినంత కడలిపొంగె!

పూరణము :- వడుకుమనియె నూలు; నడుపుమనియె పోరు
కలిమి గలుగ, దొరలు తొలగ, గాంధి;
జాతి కదలి నాడు సాధించెవిజయంబు
కదురుపాడినంత కడలిపొంగె!

9. సమస్య :- ఒకరా, యిద్దర, ముగ్గురా, నలుగురా? యున్నారలెందెందరో!

పూరణము :- సుకవుల్ వ్రాసిన పూరణంబులు వినన్ శ్రోతల్ ప్రమోదంబుగా,
కుకవుల్ హేళన జేయగా, రచయితల్ కూర్మిన్ యశఃకాములై
సకలోత్కృష్ట కవిత్వ నిర్ణయ విమర్శల్ జేయగా, గూడిరే!
ఒకరా, యిద్దర, ముగ్గురా, నలుగురా? యున్నారలెందెందరో!

10. సమస్య :- కాంతిపుంజంబు వెలిసె చీకట్లరేయి!

పూరణము :- కూలిదొరుకక - కూలికి కూడు లేక;
పాతనిల్వలుడిగి రైతు బాధపడుచు-
క్రొత్త పంటల యాసరేకెత్తెమదిని
కాంతిపుంజంబు వెలిసె చీకట్ల రేయి!

11. సమస్య :- స్నానమొనర్చు వారలకు స్వర్గము నారక ముండు దప్పులన్

పూరణము :- దానము చేయకున్న, పరదారల గూడిన గాని; ఘోరపా
పానల మందు దగ్ధులగు నట్టి జనంబునుగాని, నిత్యమున్
మానవులేరు కార్తికము మాసము నందున వేకువన్, నదీ
స్నానమొనర్చు వారలకు స్వర్గము, నారక ముండు దప్పులన్

12. సమస్య :- దండ పరిశ్రమైక జనితంబులు కావె సమస్త సంపదల్

పూరణము :- కండలు వంచి, దేశమున కర్షక కార్మిక వర్గమేకమై
యెండల వానలన్ సయిచి, యెంతయు కష్టముచేసి, మెండుగా
పండిన ధాన్యరాసులను - వస్తుల పొంది ముదంబుఁగందురు
ద్దండ పరిశ్రమైక జనితంబులు కావె సమస్త సంపదల్ !

13. సమస్య :- నీతినిబాసి కష్టపడ నేరని వారికె సర్వసంపదల్

పూరణము :- చేత హలంబుఁబట్టుకొని సేద్యపు వృత్తినిఁబూని, తాతము
త్తాతలనాటి జీవిత విధానము ఁదప్పక, ధాన్యరాసులన్
పాతర పోసి వాసిగను భాగ్యమురైతుకె; నిల్వకల్గునే
నీతిని ఁబాసి కష్టపడనేరని వారికె సర్వసంపదల్.

14. సమస్య :- నెలలో సుతుఁగన్న తల్లి నిగ నిగ లాడెన్

పూరణము :- తొలిచూలున మగబిడ్డడు
కలిగిన ఘనమన్న భర్త కలవరపడె రో
జులు గడిచినవని; పదియవ
నెలలో సుతుఁగన్న తల్లి నిగనిగలాడెన్

15. సమస్య :- నీరధి జనియించి వుప్పనిప్పయ్యెనుగా!

పూరణము :- భారత విమోచనోద్యమ
సారథి సత్యాగ్రహంబు సలిపిన వేళన్
వీరుల నేకులు కూలిరి
నీరధి జనియించి వుప్పనిప్పయ్యెనుగా!

16. సమస్య :- వనమున నున్నవాడె సుఖవంతుడు వాస్తవమెంచి చూచినన్

పూరణము :- అనుపమ భూరి సంపదల నార్జన జేసి, కుటుంబ భారమున్
తనయుల కొప్పగించి, మమతన్ విడనాడి, ప్రశాంత బుద్ధిఁబా
వన రఘురామనామమును భక్తి జపించుచు శాకభక్షుడై
వనమున నున్నవాడె సుఖవంతుడు వాస్తవ మెంచి చూచినన్

17. సమస్య :- భక్తి హుళక్కియౌ పరమ భోగి యతండు ధరాతలంబునన్

పూరణము :- యుక్తమె శ్రీనివాసునకు ? నుర్విజనుల్ ధనరాసులిచ్చి స
ద్భక్తిని లడ్డులాదిగ పదార్థము లెన్నియొ చేసిపెట్ట; నా
సక్తిగ నారగింపక ప్రసాదముల మ్మౌచు సొమ్ము పెంచగన్
భక్తి హుళక్కియౌ పరమ భోగి యతండు ధరాతలంబునన్

18. సమస్య :- జారుల గాంచి వందనము సల్పిరి భక్తులు ముక్తి కాంచనై.

పూరణము :- కోరు వరంబులెల్ల సమకూర్చెడు శ్రీరఘురాము నిత్యమున్
హారము వేసి, పూజలిడి హారతి నిచ్చి నివేదనంబు, జో
హారుల సల్పి, తీర్థమున నార్తిని బాప సమర్థులైన పూ
జారుల గాంచి వందనము సల్పిరి భక్తులు ముక్తి కాంచనై

19. సమస్య :- మతిలేకున్నట్టి నరుడు మాన్యుడుధరలోన్

పూరణము :- స్థితి యున్నను - లేకున్నను;
బ్రతుకగ నతినేర్పు, నోర్పు, పరహిత సత్వం
గతి యును కల్గి యసూయా
మతిలేకున్నట్టి నరుడు మాన్యుడుధరలోన్

20. సమస్య :- జమునకు శాంతిపెంపెసగె సౌఖ్యము వర్ధిలెనింది రాకృపన్

పూరణము :- అమరులు నెహ్రు, శాస్త్రియు, మహాత్ముడు గాంధి - సుభాసుచంద్రుడున్
శ్రమబడి రాజకీయముల సారముఁదెల్పగ; భారతావనిన్
సమయముఁ జూచి సూత్రములు - శాసనముల్ యొనరించగన్ సమా
జమునకు శాంతిపెం పెసగె - సౌఖ్యము వర్ధిలె నిందిరాకృపన్

21. దత్తపది :- బలి - చలి - వెలి - కలి

పూరణము :- బలిమిన్ ద్రోహులఁబట్టి దేశమును కాపాడంగ, నిర్వాసులన్
చలి దీర్చన్ భరతోర్వి కాటక మడంచన్ రాత్రి పైశాచులున్
వెలిగాన్ సూత్ర ముఖంబు సేసెడిని భావిన్ చక్కజేయంగ; నీ
కలిలో కల్క్యవతారమిందిరయెగా గాంధేయ మార్గంబునన్

22. సమస్య :- భూగర్భంబున దాచియుంచె సగమున్- పుణ్యాత్ముడై సంపదన్

పూరణము :- బాగోగుల్ తెలియంగలేక, ధనమే ప్రాణంబుగా గూర్చి తా
భోగుండై సగమందు ఖర్చుపడ, లుబ్ధుండైతినన్ బోక, హ్రా
ద్రోగుండై పెరవారికీక తుది భీతుండై 'ప్రజార్థంబుగా'
భూగర్భంబున దాచియుంచె సగమున్ పుణ్యాత్ముడై సంపదన్

23. సమస్య :- సంతతి లేని వారలకు స్వర్గ సుఖమ్ము లభించు ధాత్రిపై

పూరణము :- సంతతి లేని వారలకు సద్గతి లేదని యార్యులంద్రు; శ్రీ
మంతుల కేని నేడు కడుభారము బిడ్డలు పెక్కురున్నచో,
ఇంతికి నొక్క రిద్దరుదయించినఁజాలదె! యంతకెక్కుడా
సంతతి లేని వారలకు స్వర్గసుఖమ్ము లభించు ధాత్రిపై

24. దత్తపది :- బలి - వలి - చెలి - కలి

పూరణము :- బలిమిని వరిఁగోయుచు - కొడ
వలి తాఁకి మడమ తెగఁ దడి వస్త్రము చుట్టెన్
చెలికాఁ, "డబ్బా" యనికే
కలిడుచు గృహమేగె క్రొత్త కర్షకుఁడకటా!

25. దత్తపది :- కసి - నిసి - వసి - పసి

పూరణము :- కసి తీరెనా, లేదో ! మా
నిసియే? చరణమున సత్యనిజపతిఁ ద్రోసెన్
వసి యై కుసుమంబీయక
పసి వాడైతోచె సతికి పతియావేళన్

26. సమస్య :- తునిలోపల జగము లెల్ల తూగుచునుండెన్

పూరణము :- కనుగొనెనణు శక్తిని, చం
ద్రుని లోకంబుఁగని వచ్చె; రుగ్మతగల గుం
డెను మార్చెఁ; దలప, మతిమం
తునిలోపల జగము లెల్ల తూగుచునుండెన్

27. వర్ణన :- రామాయణంలో అరణ్యములో లక్ష్మణుని విచారము

పూరణము :- "పెనులోభంబున లేడిఁగోరి పతికిన్ వేరయ్యె వైదేహి, న
న్ననుమానించిన దన్నసాహసమున తృల్పంబుగా నెంచె, దై
వ నియోగంబనివార్యమయ్యె, తరుణీ స్వాంతంబు సర్వం కషం"
బని శ్రీరాముని యాజ్ఞ లక్ష్మణుడు ద్రోయన్ జేసి చింతింపడే!

28. సమస్య :- కరణముఁజూచి పండితులు కావ్యములల్లుట యుక్తమే కదా!

పూరణము :- కరణము మీద యుండిన పుకారులు నిందలు పాల్లుపోవగా
నిరువది సూత్రధర్మముల నేర్పడ పేదలకిండ్లు, భూమి-సం
స్కరణల దేల్చి భూములను సత్వరమిచ్చి సుకీర్తి పొందినన్
కరణముఁ జూచి పండితులు కావ్యములల్లుట యుక్తమేకదా!

29. దత్తపది :- **జాతి - నీతి - గీతి - రీతి**

పూరణము :- జాతి కి సేవలు సలుపుచు
నీతి గ పాలింప పదవి నిలుచును; యుద్యో
గీ! తిని, త్రాగి, పారలి, నా
రీతిలకము వెంటపడ నరిష్టము కలుగున్

30. దత్తపది :- **కిటి - కటి - తటి - నటి**

పూరణము :- కిటి కి కడనిల్చి యొక్కడు కిటుకుఁ దెలుప
కటిక చీకటి పాలు మోగడలు యమున
తటికి (గొని పోయి మిత్రులఁదనుపుదట చె
నటి వె? వ్రేతల వంచింప నందతనయ!

31. సమస్య :- **తారా! రమ్మని రామమూర్తి పిలిచెన్ దారన్ ప్రమోదమ్ముగన్**

పూరణము :- క్రూరాత్ముండయి రావణుండు సతినిన్ గొంపోవ, చింతించి, ఘో
రారణ్యంబుల నెందుఁ గానక మతిభ్రంశంబుఁ దానొంది, యే
తీరై యెందును జూడ సీతఁ గని భ్రాంతిన్ జెంది, వాపోయి, "సీ
తా, రా! ర" మ్మని రామమూర్తి పిలిచెన్ దారన్ ప్రమోదమ్ముగన్

32. సమస్య :- **భార్యను జూచినంత పరభామినిపై మనసాయె భర్తకున్**

పూరణము :- ఆర్యులు తల్లి దండ్రులు మహా గుణవంతుల పల్కులన్ శిరో
ధార్యముగా గణించి యొకతన్విని బ్రీతిని బెండ్లియాడె నా
చార్యుడొకండు; కృష్ణ మున చందురు వోలె కృశించునట్టి యా
భార్యను జూచినంత పరభామినిపై మనసాయె భర్తకున్

33. సమస్య :- **రారా రమ్మని పిల్చెనాథుని సతీ రత్నంబు చోద్యంబు గన్**

పూరణము :- దూరాలోచన లేక లక్ష్మణుని నే దూషించి పొమ్మంటి - మా
యారూపంబున నున్న దానవుని డాయన్ వచ్చితిన్, రాఘవా!
క్రూరాత్ముండ యి రావణుండిపుడు నన్ గొంపోవుచుండెన్, వడిన్
రా, రా, రమ్మని పిల్చె నాథుని సతీ రత్నంబు చోద్యంబుగన్

34. సమస్య :- **కాంతయె మూలమ్ము ధాత్రి కలహమ్మునకున్**

పూరణము :- శాంతికి - దాంతికి - భ్రాంతికి
కాంతయె మూలమ్ము; ధాత్రి కలహమ్మునకున్
కాంతయె యౌవనవింతయె?
కాంతకు వంతైన తంతు కాంతుమె జగతిన్

35. దత్తపది :- **అంత - చింత - వింత - సంత (ఉగాది సందర్భము)**

పూరణము :- అంతమె బాధల కిలలో?
చింత లడఁచి నేఁడుగాది చిత్తమలర జీ
వింత మనుచు కాంతునితో
సంతకు పూఁబోడి యొకతె చతురతనరిగెన్

36. సమస్య :- **అందరు అందరే మరియు నందరు నందరె అందరందరే!**

పూరణము :- కొందరు వ్యక్తి గొప్పనిన - కొందరు సంస్థయె మిన్నటంచు నిం
కొందరు ఆత్మతత్త్వమని - కొందరు బుద్ధి వికాసమంద్రు, వీ
రందర గూర్చువాడు పరమాత్మయటంచు దలంపరక్కటా!
అందరు అందరే మరియు నందరు నందరె అందరందరే!

37. దత్తపది :- **వడి - చడి - తడి - మడి**

పూరణము :- వడి వడి నిద్రలేచి - తెలవాఱక ముందర కర్షకుండుప
చ్చడి మెతుకుల్ భుజించి వరిసాగు పొలంబున కేగి యచ్చటన్
తడిసిన నేలదున్ని జల దారులు, గట్లును చక్కజేసి, యే
మడికది దమ్ము చేసి తగుమాత్రము నీరిడు నాట్ల ముందరన్

38. సమస్య :- **అమవస నాటి రాత్రి చెలియా! బ్రతుకంత యుపండుగయ్యెనే!**

పూరణము :- "అమరులు మెచ్చ క్రూర నరకాసురుఁగూల్చి, యశంబు బొంది;లో
కములకు శాంతి గూర్చితివి కావున నాశ్వయుజంపు మాసమం
దమవస నాటి రాత్రి చెలియా! బ్రతుకంతయు పండుగయ్యెనే
సుమ! ప్రజ" కంచు శౌరి కడుచోద్యముగా సతి సత్యతో ననెన్

39. సమస్య :- **విధవా! రమ్మని పిల్చెనామె విభునిన్ ప్రేమాతి రేకమ్మునన్**

పూరణము :- "పృథివిన్ సర్వము కృష్ణమూలముగ కన్పించున్ సుమీ రాధకున్ !
సుధలన్ జిల్కెడు నీదు నెమ్మొగమునన్ సొంపుల్ గనన్ లేక, నీ
యధరం బానగ లేక నా బ్రతుకిలన్ వ్యర్థంబె; లేదింక భా
వి; ధవా! ర" మ్మని పిల్చె నామె విభునిన్ ప్రేమాతి రేకమ్మునన్

40. సమస్య :- **భారత గాధ రాముని ప్రభావము కన్పడు నద్భుతంబుగన్**

పూరణము :- భారత జాతి గర్వపడ వ్యాసుడు వ్రాసిన కావ్యరీతి నా
తీరున రూప కల్పనము దీటుగ నీటుగ జేసిరంట, యీ
చేరువ నాడు నాచలన చిత్రము చూతము నేడు మిత్రమా!
భారత గాధ; రా! ముని ప్రభావము కన్పడు నద్భుతంబుగన్

41. సమస్య :- **రణమే శాంతికి సాధనంబనుచు నారాధింతు మెవ్వేళలన్**

పూరణము :- మణి భూషాంబర వస్తు సంపదలు నీ మాయా ప్రపంచంబు నం
దణుమాత్రంబును తృప్తి సేయకయె - దుర్వ్యామోహమున్ బెంచు; ర
క్షణ భారంబు వహించు నీశ్వరుడు నిష్టార్థంబులన్ గూర్చు కా
**రణమే శాంతికి సాధనంబనుచు నారాధింతుమెవ్వేళలన్**

42. సమస్య :- **బారున్ గని శ్రోత్రి యుండు వహ్వాయనియెన్**

పూరణము :- ఆ రోజు జన్మదినమని
పేరిమి మిత్రుండు పిలిచి పెట్టిన యల్పా
హారము హల్వా, వడ, సాం
**బారున్ గని శ్రోత్రియుండు 'వహ్వా' యనియెన్**

43. వర్ణన :- **సీతారాముని కల్యాణ సమయమున విశ్వామిత్రుని అనుభూతి**

పూరణము :- పరిరక్షించెను నాదుయాగమును నీ బాలుండు రాముండు; నీ
తరుణీ రత్నము సీత నీతనికి నర్ధాంగిన్ దగన్ జేసి, యి
క్కరణిన్ ప్రత్యుపకారమున్ జరిపితిన్ ఖ్యాతిన్ సమార్జించితిన్
పరమానందము జెందితిన్ మదిని నా భాగ్యంబు సామాన్యమే!

44. సమస్య :- **పాపంబున్ పనికే ఫలంబటుల సంప్రాప్తంబ ముమ్మాటికిన్**

పూరణము :- తాపంబున్ గొని కుందె నీ గతిని, సీతాసాధ్వి; లంకాపురిన్:
"నే పంతంబున లేడి(గోరి పతి సాన్నిధ్యంబు(బో(ద్రోచితిన్
కోపంబున్ మది(జెంది లక్ష్మణుని సంకోచించి నిందించితిన్
**పాపంబున్ పనికే ఫలంబిటుల సంప్రాప్తంబ ముమ్మాటికిన్!"**

45. దత్తపది :- **వనము - జనము - ధనము - మనము ( రామాయణార్థం)**

పూరణము :- వనమున రాముపత్ని(దెలవారకమున్నుగ( జూడ నేన్ ప్రయో
జనము హుళక్కి; వాలమున శత్రు పురంబును జుట్టి యెత్తిసా
ధనము నొనర్తు నా ప్రభు పదంబుల సన్నిధి(జేర్తు నంచుతా
మనమున నూహ జేసె హనుమంతుడ దెంతటి శౌర్యవంతుడో!

46. సమస్య :- **సారాతెమ్మనె రాఘవుండు హనుమన్ సంతోష మేపారగన్**

పూరణము :- పారావారము దాటి, సీతగని, సంభాషించి, భద్రంబుగా
జేరన్ వచ్చిన వాయునందనుని మెచ్చెన్ కీశయూథంబటన్:
"శ్రీరామామణి రత్నమిచ్చెగద, కిష్కింధాపురీపుణ్య వా
**సా,రా; తె" మ్మనె రాఘవుండు హనుమన్ సంతోషమేపారగన్**

47. దత్తపది :- బారు- వారు - కారు - మారు (భారతార్థం)

పూరణము :- "బారులు తీరిరి యల్లదె,
వారు గురు పితామహాది బంధులు; వైరుల్
కారు, భయంబు వలదు మా
మారుగ పాలింత్రు - రథము మరలుపు కృష్ణా!"

రెండవ పూరణము:- "కారు పరులు పాండుసుతులు, పోరువలదు
మారు పలుకకుమామ, నా మాట వినుము!
వారు కోరు భాగము నిచ్చి పంపు! విరియఁ
బారువంశ గౌరవ" మని పలికె శౌరి!

48. సమస్య :- ఇల్లలుకంగ పండుగగునే ! కలనొక్కటి గాంచ వేగునే!

పూరణము :- "చెల్లనె రాము ఘోరవన సీమల కంప! గతించె తండ్రి, న
న్నల్లరి పాలుచేసితివి! యన్నను జేరెద; నేలు కొందువే!
ఇల్లలు కంగ పండువగునే! కలనొక్కటిగాంచ వేగునే!
యొల్లను రాజ్య మం" చనెమహోగ్రుడునై భరతుండు తల్లికిన్

49. వర్ణన :- క్రిష్టమస్ సందర్భముగా పద్యము

పూరణము :- సిలువ వేయ రక్తము మేనజిందుచున్న
"ఏమి చేయుచుండిరొ తండ్రి! యెఱుగని పసి
పాపలు; దయను వీరి కాపాడు"మ నిన
ఏసు పలుకులె జగతిని యేలుసతము

50. సమస్య :- వరి నదిలో జలకమాడ పాపము పోవున్

పూరణము :- పరలోక వాసులైన పి
తరులకు సంక్రాంతి నాడు తర్పణ మిడునా
తరుణము పదునాల్గున జన
వరి నదిలో జలకమాడ పాపము పోవున్

51. సమస్య :- బ్రతుకగ నెంచువారలిటువంటి య కార్యము పొంతబోదురే!

పూరణము :- "మతి చెడె నీకు రావణ! ప్రమాదము నెత్తికి తెచ్చుకొంటివే!
బ్రతుకగ నెంచు వారలిటువంటి య కార్యము పొంత బోదురే!
అతుల పరాక్రమాన్వితుడు ఆరఘు రాముడు నిన్నుగూల్చు! నీ
వతనికి సీతనిచ్చి శరణందు"మటంచు విభీషణుండనెన్

52. దత్తపది :- **అంత - చింత - సంత - వింత (సంక్రాంతి సందర్భము)**

పూరణము :- అంతయు మన మంచికె యని
చింతల నెడఁబాపి దైవచింతన మదికిన్
సంతసమొద గూర్పగ, భా
వింతము "సంక్రాంతి లక్ష్మి" వెలువడు వేళన్

53. వర్ణన :- **వికలాంగులకు ప్రభుత్వము చేయదగు సహాయము**

పూరణము :- కనుచూపులేని వారికి
విననేరని జనులకు మరివికలాంగులకున్
అనువగు విద్యల నేరిపి
పనిపాటలు చూపవలయుఁ బరిపాలకులే!

54. దత్తపది :- **అలికి - పలికి - కలికి - ఉలికి ( ఉగాది సందర్భము)**

పూరణము :- అలికిరి ముగ్గుదిద్దిరి మహాకుతుకంబున దైవగాథలం
పలికిరి, నింబపుష్ప రసభక్షణఁ జేసిరి, యంత భర్త లా
కలికి సహింప లేక కడుగాసిలి కేకలు పెట్ట భామినుల్
యులికిరి పంచభక్ష్యములు నూపిరి సల్పక చేయుపట్టునన్

55. దత్తపది :- **జనవరి - మార్చి - మే - జులై (రామాయణార్థం)**

పూరణము :- తాటకిఁబరిమార్చి - తపసి జన్నము గాచి
దనుజులైన వారి దర్పమడచి
మేలు పలుకులెంచి మిథిలకు మునివెంట
జన, వరించె రాము జనక సుతయు

56. సమస్య :- **దారిద్ర్యంబున కంటె మేలగును కాదా! చావు మర్త్యాళికిన్**

పూరణము :- చీరల్ మంచివి కట్టలేము గద ఛీ! ఛీ! యంచు కన్యామణుల్
కూరల్‌బియ్యము పప్పులేవనుచు గగ్గోల్‌పెట్టు నర్ధాంగి తా
నీరోజే బడి 'ఫీజు' కట్టవలె తండ్రీ యంద్రు పుత్రుల్ కటా!
**దారిద్ర్యంబున కంటె మేలగును కాదా! చావు మర్త్యాళికిన్**

57. సమస్య :- **స్తుతియింపన్ దగు శాత్రవుండవయినన్ శూరుండ! నిన్నిత్తరిన్**

పూరణము :- సతియన్వేషణలో కృతార్థతను గాంచన్ లేక సుగ్రీవుస్నే
(రామాయణార్థం) హితుఁగాఁ గైకొనఁగోరి యింద్రసుతునన్నీ రీతిఁ గూల్చంగ నా
శ్రిత సంరక్షణ దక్షుడంచు బిరుదున్ జేకూతె! శ్రీరామ! నిన్
**స్తుతియింపన్ దగు శాత్రవుండవయినన్ శూరుండ! నిన్నిత్తరిన్**

58\. సమస్య :-

పూరణము :- "అతిభీతిన్ శరణంబుగోరుచుగయుండర్థించెఁ గాపాడగా
భారతార్థం వ్రతమున్ ముందుగఁబూనినాడ" ననుచున్ వాదించి, నాతోడను
ద్ధతి యుద్ధంబును జేయ సిద్ధపడు పార్థా! యిద్ది ద్రోహం బగున్
**స్తుతి యింపన్ దగు శాత్రవుండవయినన్ శూరుండ! నిన్నిత్తరిన్**

59\. సమస్య :- మతిహీనుండొకడే అమాత్యపద సంభావ్యుండగున్ ధారుణిన్

పూరణము :- సతియున్‌బిడ్డలు రోయనీ, అనుచరుల్ సంబంధులున్ దూఱనీ,
మతికిన్ దుర్భరమౌచు జీవితము వమ్మైపోవనీ! నమ్మె శ్రీ
పతినే బమ్మెరపోతనార్యుడవురా! ప్రాపంచిక భ్రాంతి దు
**ర్మతి హీనుండొకడే అమాత్య పద సంభావ్యుండగున్ ధారుణిన్**

60\. సమస్య :- మీసమ్ముల్ మెలివేసి నిల్చెయెదుటన్ మీనాక్షి వోహో యనన్

పూరణము :- ఆసల్ వాసిరె! యైదువూళ్ళ కొఱకై యర్థింతురేవైరి? నా
వేశంబొప్పపతుల్ సభాస్థలి నిమున్ బీరమ్ములన్ బల్కిరా
బాసల్ వమ్మయెనేమి! కృష్ణ! యనియెన్ పాంచాలి; భీముండటన్
**మీసమ్ముల్ మెలివేసి నిల్చె యెదుటన్ మీనాక్షి యోహో! యనన్**

61\. దత్తపది :- ర్ణ - ర్ణ - ర్ణ - ర్ణ - (నూతన సంవత్సర శుభాకాంక్షలు, చంపకమాల)

పూరణము :- హరిజనులన్యులే ధరణి - అర్ణము నందగ రాని దూరపా
వరణలవేల? కాపురము పర్ణగృహమ్ముల నేల? బేలలై
వరలగ నేల? యెల్లరును వర్ణ వివక్షత మాని నూత్నవ
త్సర సమయంబు దీక్షగొని స్వర్ణయుగంబును జేయుడేకమై!

62\. సమస్య :- మాయల్ గీయలు సాగిరావెపుడు ధర్మం బే తుదిన్ గెల్చెడిన్

పూరణము :- మాయా వేషము బూని సీతఁగొని లంకాధీశుడే కూలడే!
మాయల్‌పన్నిసుయోధనుండు తన సామ్రాజ్యంబుఁ గోల్పోవడే!
శ్రేయోవాంఛిత కర్మమాచరణమేశ్రేష్ఠంబు స్పష్టంబుగన్
**మాయల్ గీయలు సాగి రావెపుడు ధర్మంబే తుదిన్ గెల్చెడిన్**

63\. సమస్య :- గ్రహబల మెందుకున్ పనికిరాదు గ్రహాల బలంబు ముందటన్

పూరణము :- అహరహ మర్థలబ్ధికి ప్రయాసలు పొందగనేల? యీదురా
గ్రహులగు మిత్ర బాంధవ నికాయముఁ గొల్వగనేల? వీరను
**గ్రహబల మెందుకున్ పనికిరాదు గ్రహాల బలంబు ముందటన్**
మహిమలజూపి ప్రోచు గ్రహమండలమున్ నుతియింపఁజెల్లదే!

64. సమస్య :- కుందేల్ సింహంబుఁ దరిమి కోఱలజూపన్

పూరణము :- అందరియుత్సాహము తల
క్రిందయి రాముండు వనికి క్రీడగ నడువన్
ముందర మిక్కిలి మిడిసెను
**కుందేల్ సింహంబుఁ దరిమి కోఱల జూపెన్**

65. సమస్య :- హనుమంతుని తోక మీద అర్జునుడెక్కెన్

పూరణము :- ఇనుడుదయించెను; శంఖ
ధ్వని వినిపించె; వసుదేవ తనయుండటని
త్వైను రథమును; కనుపించెను
**హనుమంతునితోక, మీదయర్జునుడెక్కెన్**

66. సమస్య :- ముగ్గురు పంచ పాండవులు మూడు జగమ్ముల వన్నె కెక్కరే!

పూరణము :- మ్రగ్గెను యుద్ధ భూమినభిమన్యుడు వైరులనుగ్గొనర్చుచున్
ఎగ్గొనరించె కర్ణునికి హీనపరాక్రముఁ జేసి కుంతియున్
పగ్గముఁ బట్టి శౌరియును పార్థునిఁగాచె; జయంబు గూర్చిరీ
**ముగ్గురు; పంచపాండవులు మూడు జగంబుల వన్నె కెక్కరే!**

67. సమస్య :- రాలను రువ్వువారికి వరాల నొసంగును దైవమిమ్మహిన్

పూరణము :- పాలనఁ జేయువాని భగవానుని నమ్ముచు, కామ్య కర్మముల్
తాలిమి తోడ ధర్మమును దప్పక సల్పుచు, భక్తిగల్గి, యె
వ్వేళల దైవమున్ శరణువేడుచు నాతనిపైన సర్వ భా
**రాలను రువ్వు వారికి వరాల నొసంగును దైవ మిమ్మహిన్**

68. సమస్య :- పాలను మూట కట్టుకొని పార్దుడు సాగెను దండయాత్రకై

పూరణము :- బాలుని జేసి వ్యూహమును పన్ని కటా! అభిమన్యు నాజిలో
కూలిచినారు కౌరవులు; అందరలోన యిందుకున్
మూలమునైన సైంధవుని ముందుగ చంపెదనంచు కోపతా
**పాలను మూటగట్టుకొని పార్థుడు సాగెను దండయాత్రకై**

69. సమస్య :- గతకాలము మేలు వచ్చు కాలము కంటెన్

పూరణము :- అతివలను గౌరవింపక
మతి మంతుల మాట వినక మసలుట మొదలై
గతిలేని బ్రతుకు లయ్యెను
**గత కాలము మేలు- వచ్చు కాలము కంటెన్**

70. సమస్య :- రామ - సీత - కైక - మంధర (భారతార్థము)

పూరణము :- "రథము నాపుము, కృష్ణ; విరామమిమ్ము!
కలతఁగనె మాన సంబిసీ! తలపుమారె!
రాజ్యమునకై కడగి యిందర గురు బంధు
జనులదునుమన్ ధరనకార్య" మనె కిరీటి

71. సమస్య :- నరుని తృప్తి పరుప నలువ వశమె

పూరణము :- కృష్ణుడలుగు గాక! గృహిణి యేడ్చునుగాక!
అగ్రజుండు వచ్చి యడ్డుపడిన
గయుని ప్రాణములను కాపాడునందాక
నరుని తృప్తి పరుప నలువ వశమె!

72. దత్తపది :- గడి - గుడి - మడి - ముడి (కాలగమనము)

పూరణము :- గడియింపగ ధనరాసులు;
గుడి యందును గురువు నందు గుఱియేలేకన్
ముడి విడియని చిక్కుల బడి
మడియుచు నుండ్రుగద నేడు మానవులకటా!

73. సమస్య :- కందము గూర్చినన్ కవి, సుగంధము దాల్చిన సువ్రతుండగున్

పూరణము :- మందున కొక్క రోగమును మాన్పగ జాలినవాడు వైద్యుడా!
అందల మెక్క గల్గిన, మహాగుణవంతుడు గా చెలంగెడిన్
చిందులు త్రొక్క నేర్చిన వచింతురు భక్తుడనంగ; నీగతిన్
కందము గూర్చినన్ కవి, సుగంధము దాల్చిన సువ్రతుండగున్

74. సమస్య :- బాణపు దెబ్బలే పడుచు వారికి సౌఖ్యము లిచ్చునెప్పుడున్

పూరణము :- బాణము దెబ్బకే విఱిచి పత్నిగ రాముడు పొందె జానకిన్
బాణము దెబ్బకే గెలిచి పార్థుడు ద్రౌపదిఁ దెచ్చె శంభుడున్
బాణము దెబ్బకే తపము భంగముగాగ వరించె పార్వతిన్
బాణపు దెబ్బలే పడుచువారికి సౌఖ్యము లిచ్చునెప్పుడున్

75. సమస్య :- రత్నగర్భాఖ్య తగును భారతమునకును

పూరణము :- "చక్రవర్తుల"-"జవ్వారు"-"సర్వేపల్లి"
"బాబు రాజేంద్రుడు"-"సుభాసు"-"వల్లభాయి"
"పొట్టి రామా"దు లిచ్చోట పుట్టియుంట
రత్నగర్భాఖ్య తగును భారతమునకును

76. సమస్య :- స్థిరముగ బోనులో బడి కృశించియు సింగము గడ్డిమేయునే!

పూరణము :- మరణము వచ్చెగాక 'బలి' మాటను దాటక దానమీయడే!
ధరణిని యేలునాప నిజధర్మముఁ దప్పగ కర్ణుడొప్పెనే!
పురములు సామ్ములున్ గొనగ పోతన భాగవతంబు నమ్మెనే!
స్థిరముగ బోనులోబడి కృశించియు సింగము గడ్డిమేయునే!

77. దత్తపది :- వల - తల - కల - అల ( పదముల భావం రాకుండా తొలకరి)

పూరణము :- వలసిన యదనుకు తొలకరి
తలచిన యట్టుల గురిసెను తడయక భూముల్
కలవారి యరకలుఁజికెను
అలయక కర్షక జనంబు హర్షముఁజెందన్

78. సమస్య :- మారణ హోమమే తగిన మానవయత్నము విశ్వశాంతికిన్

పూరణము :- ధారుణి సర్వ మానవులు తామస వృత్తిని వీడి, చిత్తమం
దోరిమి నిష్ఠయున్ గలిగి యొండొరులైక్యత నుండు ధోరణిన్
ఆరయ కామమాదిగల యార్గురు శత్రువులన్ వధించు - ఆ
మారణ హోమమే తగిన మానవయత్నము విశ్వశాంతికిన్

79. సమస్య :- పాలు వినాశమున్ బొనరు పాడగు మానవు డెన్ని భంగులన్

పూరణము :- బాలుని కోపగించునెడ పట్నమొ పల్లెకొ పారిపోయెడిన్
ఆలిని తూలనాడిన ప్రయాణము కట్టును పుట్టినింటికిన్
కాలము మారిపోయినది - గాన త్యజించుట మేలు కోపతా
పాలు. వినాశమున్ బొనరు, పాడగు; మానవుడెన్ని భంగులన్

80. దత్తపది :- హరి-గిరి-సరి-సిరి(పాదారంభంలో వచ్చులాగున చంపకమాల (భాగవతార్థం)

పూరణము :- హరియగు గాక, యీ వటువు అబ్జభవుండగు గాక, యింద్రుడేన్
గిరిసుత నేలు వాడయినఁ గీడొనరించునుగాక; ధాత్రిలో
సిరియును రాజ్యముల్ స్థిరమె! చెప్పిన యట్టుల దానమిచ్చుటే
సరియగు నంచు పల్కె బలి చక్కగ శుక్రున కెట్టి త్యాగియో!

81. సమస్య :- గాలిని బంధింప వచ్చుగా రజ్జువుతో!

పూరణము :- "ఆలి కరంబును- పతిముం
గాలిని బంధింపవచ్చుగా రజ్జువుతో
పాలును మీగడ పెరుగును
గ్రోలగ వచ్చుగద కృష్ణ!" గోప సఖుడనెన్

82. సమస్య :- పదములులేని కావ్యమునె పండిత మండలి మెచ్చునెయ్యెడన్

పూరణము :- చదువుల తల్లి మోద పడ చక్కని ఛందముకూర్పు నేర్పుతో
చదువరు లుల్లసిల్లునటు సత్కృతులన్ రచియించి పొందనౌ
పదవులు, నీతి దూరమయి భావనిగూఢ మసభ్యయుక్తమౌ
పదములులేని కావ్యమునె పండిత మండలి మెచ్చునెయ్యెడన్

83. సమస్య :- శరన్నవ రాత్రుల వర్ణన

పూరణము :- శివసాన్నిధ్యమునందు సేవలను విశ్లేషంబుగా నెంచి, యీ
భువికేతెంచి భవాదినామములతో పూజల్ దివారాత్రముల్
అవతారంబులు మార్చి కైకొనుచు నాహ్లాదంబు చెందున్ శర
న్నవ రాత్రంబుల పార్వతీ రమణి విన్యాసంబులన్ గొల్చెదన్

84. సమస్య :- మాయాలీలగ చుట్టు ముట్టెమిడుతల్ మధ్యాహ్న మార్తాండునిన్

పూరణము :- "న్యాయాన్యాయము లెట్టులుండినను వారర్థించి రైదూళ్ళు-మీ
రాయాసంబును వీడి పాండవుల కీయన్ బాడియున్, క్షేమమున్
శ్రేయంబౌ" నను కృష్ణు బట్టుకొన నెంచన్ బేలలై కౌరవుల్
మాయా లీలగ, చుట్టుముట్టె మిడుతల్ మధ్యాహ్న మార్తాండునిన్

85. సమస్య :- జాతీయ ఐక్యతకు సందేశము

పూరణము :- మతమును -కులమును తలపక
ప్రతి యొక్కడు బడుగు ప్రజల ప్రగతికి దీక్షా
మతియై కృషి సలిపిన భా
రత దేశంబు జగతి గడు ప్రఖ్యాతి గనున్

86. దత్తపది :- వన-మన-తన-ధన(పాదారంభంలో చంపకమాతలప్రకృతి సంపద - రక్షక చర్యలు)

పూరణము :- వనములు, వాగులున్, సహజవాయువు, వన్యమృగాలు, వృక్షముల్
మనకుపయుక్తమైన మణి మానికముల్ మరి పక్షిసంతతుల్
తనరుట దేశ సంపదగదా! అవి రక్షణఁ జేయునట్టి సా
ధనములు గూర్చ పాలకుల ధర్మము - విజ్ఞులకెంతో యుక్తమౌ!

87. దత్తపది :- అల-కల-తల-వల(భారతార్థము)

పూరణము :- అలవికాదుకృష్ణ! సలుప జాలను పోరు
కలత జెందెమనసు - గెలుపు వలదు
తలపు మారె గురుపితామహాదులఁ జూడ
వలదు రాజ్యమనియె పార్థుడపుడు!

88. దత్తపది :- హేతి-నీతి-భీతి-జాతి (నూతనాంగ్ల సంవత్సరాహ్వానము దేశ సంక్షేమము)

పూరణము :- హేతి రగుల్కొనునో! యని
నీతి గ యణుబాంబు గూర్చు నేర్చిరొ శత్రుల్
భీతిని బాపుము! భారత
జాతిని కాపాడు! నూత్న సంవత్సరమా !

89. సమస్య :- మంటలు మల్లె జల్లులయె - మాకవి గంధపు పూతలయ్యెనే

పూరణము :- కొంటెతనాన, బావ: జడకుచ్చులు పట్టుకులాగ; చెల్లి నా
జంటగ జేరి, తమ్ములము జాస్తిగ సున్నము పూసి పెట్టె. మా
తుంటరి బావ పక్కపయి త్రొక్కను చిందులు, నాల్క పొక్క; అ
మంటలు మల్లె జల్లులయె, మా కవి గంధపు పూతలయ్యెనే!

90. దత్తపది :- ధాత-ఈశ్వర-బహుధాన్య-ప్రమాది(రామాయణార్థము)

పూరణము :- ధాత ప్రీతిల సీతను ద్వాహమాడె
ఈశ్వరాస్త్రము శ్రీరాముడెత్తి విఱిచి
కనకమును బహుధాన్యముల్ జనకుడొసఁగె
యే ప్రమాది కాక యయోధ్య కేగెనంత!

91. సమస్య :- ఆరయనన్ని రోగములకాముదమేపరమౌషధంబుగున్

పూరణము :- దారుణమైన వ్యాధులకు తావు శరీరము కాన విజ్ఞుడీ
కారణమై కృశింపక వికారముఁ జెందక కుంద కెంతయో
నేరుపు, నోరిమిన్, ముదము నిల్పి నివారణ గాంచు ధాత్రియం
దారయ నన్ని రోగముల కా ముదమే పరమౌషధంబగున్

92. సమస్య :- అడుసున్ ద్రొక్కగనేల! కాల్గడుగనేలా! వెఱ్ఱికాకున్నచో!

పూరణము :- "అడుగన్ వచ్చిన వాడు వామనుడు, మాయా రూపుడౌ విష్ణు; వీ
బుడుతన్ నమ్మకు - మోసపోయి వగపున్ పొందంగ నీకేల? ని
ల్కడ యోచింపు బలీ!" యనన్ బలికె శుక్రాచార్యుడుత్కంఠతో
"అడుసున్ ద్రొక్కగ నేల కాల్గడుగ నేలా; వెఱ్ఱి కాకున్నచో!"

93. దత్తపది :- అలుగు-కలుగు- వెలుగు-పలుగు(భారతార్థం)

పూరణము :- "అలుగు టెఱుంగడు నాపతి
కలుగునె లాభంబు? సంధికార్యమగునె? మా
వెలుగువు నీవే! తలపవె
పలుగురు లోనాదు భంగపాటును కృష్ణా!

94. సమస్య :- ఆకాశంబున నుండి జారిపడె ముత్యంబుల్ మనోహారులై

పూరణము :- లోకారాధ్యుడు విష్ణు దివ్యకథలన్ శ్లోకించె పోతన్న యె
న్నో కావ్యంబులు నన్న యాదులును దెన్గుంజేసి శోభిల్లెమున్
సాకారంబుగ 'వాణి' సత్కవులు నైజన్మించె నాంధ్రావనిన్
**ఆకాశంబున నుండి జారిపడె ముత్యంబుల్ మనోహారులై!**

95. సమస్య :- దున్నను కని కన్నుగీటె తొయ్యలివింటే!

పూరణము :- నన్ను వదలంగనేరడు
చిన్నత్తకు పెద్దకొడుకు- చెప్పిన సిగ్గా!
వెన్నాడెనునను, గుడియం
**దున్నను - కని కన్నుగీటె తొయ్యలివింటే!**

96. సమస్య :- హింసయె మేలనుచు చెప్పరే ధర్మజ్ఞుల్

పూరణము :- హింసయధర్మము; ప్రగతికి
హింస యెయవ రోధమగు మహిని బాధలకున్
హింసయె మూలము, శాంతిక
**హింసయె మేలనుచు చెప్పరే ధర్మజ్ఞుల్**

97. సమస్య :- పతిమోమున్ గననొల్ల దయ్యెసతియున్ బాధా భయా క్రాంతయై!

పూరణము :- వ్రతమున్ బూనగనౌనె! నాయనుమతిన్ వాంఛింప కిరీతిను
ద్ధతి నన్నే దయమాలి నారదునకున్ దానంబు గావించి దు
స్థితి గల్పించితి వంచు జూచె హరియున్ శ్రీ సత్యభామా సతిన్;
**పతి మోమున్ గన నొల్లదయ్యె సతియున్ బాధా భయాక్రాంతయై!**

98. సమస్య :- తల్లికి తాళిగట్టిన యుదాత్త చరిత్రుని రాముగొల్చెదన్

పూరణము :- విల్లును వంచి, త్రుంచి, పలు వీరుల దర్పము మాటుపెట్టి శో
భిల్లి, విదేహ భూపతికి బ్రీతిని గూరిచి, గాధిపట్టి రం
జిల్లగ జేసి, భూమిసుత సీత-మహాసుగుణాల వల్లి - మా
**తల్లికి తాళి గట్టిన యుదాత్త చరిత్రుని రాము గొల్చెదన్**

99. సమస్య :- కలువల తోరణంబులవి కన్పడు వీథుల శ్రావణంబునన్

పూరణము :- కులుకుచు నిద్రలేచి-తమకోరిక దీర నలంకరించి, పూ
జల నొనరించి, లేఁవయసు చానలు దీవనలంద గోరెనె
చ్చెలులతో సంచరింత్రు గృహసీమల మంగళ, శుక్రవారముల్
**కలువల తోరణంబులవి కన్పడు వీథుల శ్రావణంబునన్**

100. సమస్య :- **నీటి విలువ తెలియ లేరు నేటికిని జనుల్**

పూరణము :- చేటయె సీతవగపసుర
కోటికి; పాంచాలి యేడ్పుకురు సంతతికిన్
వాటిల్లె కీడు; స్త్రీ క
న్నీటి విలువ తెలియ లేరు నేటికిని జనుల్

101. సమస్య :- **చక్కెర చేదనుట సుజన సమ్మత మెపుడున్**

పూరణము :- అక్కునఁ జేర్చిన తనయుం
డక్కర పడువేళ పల్కు దర్థాంగియు తా
మక్కువ జూపదు ముదిమిని,
చక్కెర చేదనుట సుజన సమ్మత మెపుడున్

*

సర్వే జనాః సుఖినో భవంతు !